ఓం

శ్రీ సీతారామచంద్ర పరబ్రహ్మణేనమః

అస్మద్గురుభ్యోనమః

# శ్రీ రామ నామామృత గేయము

భూపాలరాగము - మిశ్రగతి.

శ్రీకరము సౌఖ్యప్రదము సుశ్రేయదము శ్రీరామనామము
లోకములు సర్వంబునిండి వెలుంగునీనామం శ్రీరామనామం।
అఖిలముందానయ్యు దేవిశ నంటకున్నది రామనామము
మఖవముఖ్యాదిత్య వరసన్మాన్య మీనామం శ్రీరామనామం। ౧

సర్వసచరాచరములై నిస్తంద్రమైనది రామనామము
గర్వమతులగు దుష్టశిక్షణ కార్యమీనామం శ్రీరామనామం॥ 3
భక్తజన జిహ్వాగ్రసంతత భాగధేయము రామనామము
ముక్తికై భవమిచ్చిపోవఁగ మూలమీనామం శ్రీరామనామం॥ ౪
పార్వతీపరమేశులకు జపభావమైనది రామనామము
నిర్వహణసౌశీల్య వర్ధననివహమీనామం శ్రీరామనామం॥ ౫
హనుమదాది విభీషణ ప్రముఖావనంబగు రామనామము
యనఘవాల్మీకముని కాశ్రయమైనదీనామం శ్రీరామనామం ౬
ఇట్టిదనియట్టిదని యనరానట్టిదైనది రామనామము
బట్టబయలను భానమునను న్నట్టిదీ నామం శ్రీరామనామం॥ ౭
దశరథుని పుత్రవత్సలతం దనిపిపోచిన రామనామము
పిశితభక్షణిం దాటకినిం జంపినది యీనామం శ్రీరామనామం॥ ౮

క్రూరమారీచాది గర్వవిదూరకరమగు రామనామము
పోరి విశ్వామిత్ర సవనముఁ బ్రోచె నీనామం శ్రీరామనామం॥ ౯
దీక్షతోడ నహల్యశాపముఁ దీర్చి కాచిన రామనామము
ఆక్షితిని హరు విల్లువిఱచి జరించె నీనామం శ్రీరామనామం॥ ౧౦
జనకజాతనుఁ బాణియంబై ఘనతనొందిన రామనామము
పనిఁగొనుచు భృగురాము గర్వముఁ బాపె నీనామం శ్రీరామనామం॥ ౧౧
పురమువిడి పిత్రాజ్ఞఁ గాననభూమికేగిన రామనామము
వరమునీంద్రులఁ బ్రోవఁగఁ బ్రతినవట్టె నీనామం శ్రీరామనామం॥ ౧౨
శబరి యొంగిలిపండ్లుఁదిని యుత్సాహమొందిన రామనామము
ప్రబలకరుణను మోక్షమొసఁగిన భాగ్యమీనామం శ్రీరామనామం॥ ౧౩
శూర్పనఖకర్ణములముక్కును శుభ్రఁబరచిన రామనామము
దర్పమున ఖరదూషణాదులఁదరిగె నీనామం శ్రీరామనామం॥ ౧౪

కాలచేమాయాకురంగముఁ గూలనేసిన రామనామము
కాలవశమున సీతఁ బాసినశీలమీనామం శ్రీరామనామం। ౧౫
జానకీమణిజాడనడవులఁ బూనితిరిగిన రామనామము
కానకుంబలిగాఁగ బంధునిఁగడపె నీనామం శ్రీరామనామం। ౧౬
ఆంజనేయుని వినయనయముల కలరిమెచ్చిన రామనామము
రంజిలుచు సుగ్రీవుసఖ్యము భ్రమసె నీనామం శ్రీరామనామం। ౧౭
వాలినింభువిమీఁదశరమునఁ గూలనేసిన రామనామము
తాలిమినిసుగ్రీవురాజుగఁదార్చె నీనామం శ్రీరామనామం। ౧౮
అఖిలదిశలకు సీతవార్తల కనిపెఁ గపులను రామనామము
సఖమణి లంకస్థయునివినిసాగె నీనామం శ్రీరామనామం। ౧౯
కరుణచేత విభీషణాఖ్యునిఁగాచిమించిన రామనామము
పరువడిని వారినిధిబంధనఁబరచె నీనామం శ్రీరామనామం। ౨౦

రావణాది 'సమస్తదనుజశిరములఁ ద్రుంచిన రామనామము
దేవతలకష్టాంధ మడపినదీప మీనామం శ్రీరామనామం॥ ౧౧
రహివిభీషణునకును లంకారాజ్యమొసఁగిన రామనామము
దహనుఁడొసఁగిన సాక్ష్యమున మదిఁదనరె నీనామం శ్రీరామనామం॥ ౧౨
సతిసోదర వానరుల హర్షమునఁగూడుచు రామనామము
అతిముదమున నయోధ్య కేగిన యనఘమీనామం శ్రీరామనామం॥ ౧౩
చెలువుమీరఁగ రాజ్యమున నభిషేకమయ్యెను రామనామము
సలలితంబుగ శిష్టరక్షణసలిపె నీనామం శ్రీరామనామం॥ ౧౪
నీవెదిక్కని నమ్మువారికి నిత్యసౌఖ్యము రామనామము
కేవలానందమయమగు సంకీత మీనామం శ్రీరామనామం॥ ౧౫
దండిగా బ్రహ్మాండగణములు నిండియున్నది రామనామము
ఖండమగును యఖండమగుఁ గనబడు వీనామం శ్రీరామనామం॥ ౧౬

ఘోరపాతకసముదయమునిలఁ గూలనడచిన రామనామము
నారదాదిమహాఋషుల కానంద మీనామం శ్రీరామనామం॥ ౨౭
ఆశ్రితులదుర్గుణహరంబై యలరుచున్నది రామనామము
ఆశ్రమంబున వరసులీయఁగ నమృత మీనామం శ్రీరామనామం॥ ౨౮
సారహీనంబైన యీసంసారతారక రామనామము
భూరిదుఃఖాంబోధితరణసుపూజ్య మీనామం శ్రీరామనామం। ౨౯
అనవరతశోభనకరంబై యలరుచున్నది రామనామము
ఘనదరిద్రవినాశకరమై గ్రాలు నీనామం శ్రీరామనామం॥ ౩౦
అవ్యయంబైయభయమై యజముగుచునున్నది రామనామము
దివ్యతేజాకారమై వర్ధిల్లు నీనామం శ్రీరామనామం॥ ౩౧
దుష్టరాక్షసహారణమై నిర్దుష్టమైనది రామనామము
కష్టజీమూతవాతంబనఁగిల్లు నీనామం శ్రీరామనామం॥ ౩౨

అందమైయానందమై వెలుగొందుచున్నది రామనామము
అందరానిమహామహిమఁ బెంపొందు నీనామం శ్రీరామనామం ౩౩
దీనజనరక్షణీయంబై తేజరిల్లిన రామనామము
జ్ఞానసంపద్దాయకంబగు నూని యీనామం శ్రీరామనామం। ౩౪
తాపములఁబోకార్చి శుభములఁ దాల్చిబ్రోచును రామనామము
పాపసంచయమెల్లఁబాపఁగ భవ్యమీనామం శ్రీరామనామం। ౩౫
సంచితంబులఁబాపి యశమున మించియున్నది రామనామము
అంచితాదరచిన్మయంబై యలరు నీనామం శ్రీరామనామం। ౩౬
మీనమైమ్రుచ్చిలినసోమకు మృతినొనర్చిన రామనామము
శ్రీనివేదములజనకిడు నసమాన మీనామం శ్రీరామనామం। ౩౭
కూర్మమైవెన్నునయొక పెనుకొండమోసిన రామనామము
నిర్మలామృతమమరులకుఁ గృపనిడి నదీనామం శ్రీరామనామం ౩౮

సూకరంబై హేమనయనుని వీకఁజంపిన రామనామము
ప్రాకటంబుగ భూమిశిలుగులఁబాపె నీనామం శ్రీరామనామం। ౩౯
నరమృగంబై కనకకశిపుని నలిపివైచిన రామనామము
వరమకృపఁ బ్రహ్లాదుఁగాచిన భాగ్యమీనామం శ్రీరామనామం। ౪౦
వడుగగుచు మూడడుగులిల బలినడిగెఁబుడమిని రామనామము
అడఁచియతని రసాతలంబున కనిపె నీనామం శ్రీరామనామం। ౪౧
పరశురాముండగుచు రాజుల శిరములఁదరిగె రామనామము
వరుసమెట్టులు స్వర్గమున కేర్పరచె నీనామం శ్రీరామనామం। ౪౨
దశరథాత్మజుఁడగుచుఁ దారకతత్వమయ్యెను రామనామము
దశగ్రీవాదులనుద్రుంచిన ధన్యమీనామం శ్రీరామనామం। ౪౩
శౌరియైకంసాదిదుష్టులఁ జెల్చిమించిన రామనామము
శౌరిభూభారంబుఁ దాఁగైకొన్న దీనామం శ్రీరామనామం। ౪౪

బుద్ధుఁడై క్రూరులహరింపఁగఁ బొంచిమించెను రామనామము
ఇద్ధరణిఁ బ్రఖ్యాతిఁగాంచి చరించె నీనామం శ్రీరామనామం। ౪౫
కలికియై యిఁక ముందు విమతులనలిపివేయును రామనామము
చలనరహితంబగు ప్రకాశతఁజెఱఁగు నీనామం శ్రీరామనామం। ౪౬
జననమరణాభావమై శాశ్వతముఁగన్నది రామనామము
గనఁగనోంకారాత్మకంబై తనరు నీనామం శ్రీరామనామం। ౪౭
నిర్మలంబై నిత్యమై సన్నిహితమైనది రామనామము
ధర్మరూపంబగు సనాతన దైవమీనామం శ్రీరామనామం। ౪౮
సులభమై సర్వాశ్రయంబై చెలఁగుచున్నది రామనామము
కలిమహాకిల్బిషములడఁపఁ బ్రకాశ మీనామం శ్రీరామనామం। ౪౯
భవ్యమైబహుదివ్యమై సంభావ్యమైనది రామనామము
సవ్యముగ శరణన్నవారిం జాకు నీనామం శ్రీరామనామం। ౫౦

వాదభేదములేక పరమాహ్లాదమైనది రామనామము
నాదబిందుకళాత్మకంబను మోదమీనామం శ్రీరామనామం॥ ౫౧
మోదదాయకమగుచు సంపన్మంగళకరమగు రామనామము
ఆదిమధ్యాంత శూన్యంబైయలరునీనామం శ్రీరామనామం॥ ౫౨
కీర్తనీయంబగుచుబహు విధకిల్బిషాంతము రామనామము
ఆర్తజనచింతాపహార సన్మూర్తియీనామం శ్రీరామనామం॥ ౫౩
అణువుకణువై సర్వమై యలరారుచున్నది రామనామము
ప్రణతులగు సద్భక్తజన సంగతమీనామం శ్రీరామనామం॥ ౫౪
నిత్యసత్యవినిర్మలంబై నెగడుచున్నది రామనామము
ప్రత్యగాత్మాకారమున నిలబ్రబలు నీనామం శ్రీరామనామం॥ ౫౫
అందరానిఫలంబుగతి నింపొందుచున్నది రామనామము
సందుదెలిసినవారివశమనిశంబు యీనామం శ్రీరామనామం॥ ౫౬

అజహరాదులకు నగోచర మనఁగ నొప్పును రామనామము
నిజమెఱింగినవారిమనమున నిలచునీనామం శ్రీరామనామం॥ ౫౭
సాక్షియైసర్వంబుఁ గానఁగ దీక్షనున్నది రామనామము
రక్షకత్వంబునను సజ్జన పక్షమీనామం శ్రీరామనామం॥ ౫౮
చింతనామృతరసమయము వేదాంతవేద్యము రామనామము
అంతకాంతమగుచుఁ బరసుఖవంతమీనామం శ్రీరామనామం॥ ౫౯
సత్యధర్మాత్మకమనంగఁ బ్రశస్తమైనది రామనామము
ప్రత్యహమ్మనుపమానంబై ప్రబలునీనామం శ్రీరామనామం॥ ౬౦
భూతభేతాళగ్రహాటవి వీతిహోత్రము రామనామము
చేతనాచేతనమయంబై చెలఁగునీనామం శ్రీరామనామం॥ ౬౧
రోగజాలంబంతకును నిర్మూలనకరము రామనామము
యోగిజనులకు హృద్యమై సుఖమొసఁగునీనామం శ్రీరామనామం ౬౨

దాపగుచు దాసులను శుభములఁ దనుపుచుండును రామనామము
ఆపదోద్ధారకమగుచుఁ గతిఁజూపునీనామం శ్రీరామనామం॥ ౬౩
చిరతరంబగు సర్వపుణ్య శ్రేయఫలదము రామనామము
పరమగుహ్యమనాద్యమఖిల ప్రభావమీనామం శ్రీరామనామం। ౬౪
అప్రమేయం బాద్యమమరం బద్వితీయము రామనామము
సప్రమాణమహామహిమ విస్తారమీనామం శ్రీరామనామం॥ ౬౫
అచలమైజ్ఞానానుభవమై యభవమైనది రామనామము
సుచరితంబులలోననుపమగు చున్నదీనామం శ్రీరామనామం॥ ౬౬
కేశవాదియనంత నామాంకితసుభూషణ రామనామము
దాశరథియనుపేర జగమునఁ దనరునీనామం శ్రీరామనామం ౬౭
కోటిసూర్యప్రభలమించి సుగూఢమైనది రామనామము
సాటిలేనిప్రకాశమని విస్పష్టమీనామం శ్రీరామనామం॥ ౬౮

సాధనాంతరములకసాధ్య విచారకరమగు రామనామము
సాధుజనులకు సులభతర సంబోధమీనామం శ్రీరామనామం। ౬౯
ఎఱింగి యెఱుంగక చేయుదోషము లెల్ల కాపును రామనామము
మరియు మరియున్మంగళములిడి మనుచునీనామం శ్రీరామనామం। ౭౦
భోగ్యమైతగు యోగ్యమై యారోగ్యమైనది రామనామము
భాగ్యమైసంపత్సమృద్ధి విభావమీనామం శ్రీరామనామం। ౭౧
సాపరాధులనైనరక్షణ సల్పుచున్నది రామనామము
ప్రాపకంబై శ్రితులకమిత ప్రమదమీనామం శ్రీరామనామం। ౭౨
మర్జయంబై శత్రుశిరములఁ ద్రుంపఁ దెంపరి రామనామము
నిర్జరావనసాక్షికరమై నిలచునీనామం శ్రీరామనామం। ౭౩
అద్రిజాత్మికప్రాణకాంతుని యనుభవంబగు రామనామము
భద్రములఁగృప నేయుటకు చిన్ముద్రమీనామం శ్రీరామనామం। ౭౪

భ్రాంతిరహితంబై యొసఁగు వేదాంతసారము రామనామము
సంతతాభయదాయకము స్వచ్ఛందమీనామం శ్రీరామనామం ౪౫
సకలఫలరుచిమించి మధురమొసంగు జిహ్వకు రామనామము
వికటమతులకవాచ్యతరమగు విషమమీనామం శ్రీ రామనామం ౪౬
బాపురేయన స్వప్రభాశోభాయమానము రామనామము
చూపులోఁజూపై వెలుఁగుచిద్రూపమీనామం శ్రీరామనామం। ౪౭
పంచవింశతి తత్వములకున్మించియున్నది రామనామము
సంచితాగాములహారి ప్రశస్తమీనామం శ్రీరామనామం। ౪౮
సాగరోపమమైన మోహపిశాచభగ్నము రామనామము
రాగరహితులపాలిసంపద్భోగమీనామం శ్రీరామనామం॥ ౪౯
తల్లిదండ్రియు బంధుజనగురుదైవమైనది రామనామము
ఎల్లభంగులక్షేమకరమగు చేలునీనామం శ్రీరామనామం॥ ౫౦

శాంతమైవిశ్రాంతమై విక్రాంతమైనది రామనామము
చెంతఁజేరినవారికి దయావంతమీనామం శ్రీరామనామం॥ ౮౧
సదయహృదయుల లోకరక్షణసల్పుచున్నది రామనామము
బొదలుచుఁబరంజ్యోతియై యింపొందునీనామం శ్రీరామనామం॥ ౮౨
తుదమొదలుఁగనరాకపరిమితి తోఁచకున్నది రామనామము
వెదకినఁబరంజ్యోతిమయమై వెలయు నీనామం శ్రీరామనామం॥ ౮౩
శక్తియుక్తులకేమివశఁబడఁజాలకున్నది రామనామము
భక్తియనునొకదానికే లోఁబడను యీనామం శ్రీరామనామం॥ ౮౪
వైరులెంతటివారలైనను వశముఁగాదీ రామనామము
ధీరులగుదాసులకులోనై తీరు నీనామం శ్రీరామనామం॥ ౮౫
కులముగోత్రంబనక దాసులఁగూడిమెలఁగును రామనామము
సలలితంబగు మోక్షఫలమిడఁజాలునీనామం శ్రీరామనామం॥ ౮౬

ఎల్లచదువులుఁజదివినను ఫలమిియఁబోవదు రామనామము
గొల్లఁడైనస్మరింప ముక్తినిఁగూర్చునీనామం శ్రీరామనామం। ౮౭
శ్వపచుఁడైనను నమ్మియున్నఁబ్రశస్తుఁజేయును రామనామము
చపలుఁడగుద్విజుఁడైనపూజ్యు మొసంగదీనామం శ్రీరామనామం। ౮౮
కొల్లకొల్లగఁ గృపనుభువి వెదఁజల్లుచున్నది రామనామము
కల్లనిజమరసినమఁగన్నులఁగట్టునీనామం శ్రీరామనామం। ౮౯
దంభమత్సరక్రూరజనవాక్స్తంభనంబీ రామనామము
కుంభినీసుతచిత్తరంజనఁగోరునీనామం శ్రీరామనామం। ౯౦
అనిశమాశ్రితవత్సలంబై యలరుచున్నది రామనామము
మునిజనక్షేమప్రదమునకుమూలమీనామం శ్రీరామనామం। ౯౧
అవనిఁబ్రహ్లాదాదిభక్తులనాదరించిన రామనామము
ప్రవిమలవివిధనాదమయమై ప్రబలునీనామం శ్రీరామనామం॥ ౯౨

దేవదేవత్వమున నెల్లెడఁ దేజరిల్లును రామనామము
జీవజీవపరత్వమునఁ సత్తేజమీనామం శ్రీరామనామం॥ ౧౩
జంతుసృష్టిస్థితిలయములఁ బ్రసక్తిఁ గొన్నది రామనామము
వింతవింతవిచిత్రములగావించునీనామం శ్రీరామనామం॥ ౧౪
స్వైరలీలావిషయగతినిటుసల్పుచుండును రామనామము
వేరువేరఁ జూపిచూపి కటగావించునీనామం శ్రీరామనామం॥ ౧౫
విశ్వమయమై విశ్వమేయై వెలుఁగుచున్నది రామనామము
శాశ్వతామోదప్రదంబై జరుఁగునీనామం శ్రీరామనామం॥ ౧౬
దానధర్మాహ్లాదకరమై తినరుచున్నది రామనామము
భూనభోంతరగోళగణసంపూర్ణమీనామం శ్రీరామనామం॥ ౧౭
సూరిజననుతమగుచు సత్యముఁ గోరుచున్నది రామనామము
తేరిచూడఁగ రాకయుంతట మీరు నీనామం శ్రీరామనామం॥ ౧౮

స్వానుభవ వేద్యమునఁ దనకుందాన భోగ్యము రామనామము
శ్రీనికేతనమై యభేద్యతఁజెలఁగు నీనామం శ్రీరామనామం॥ ౯౯
అద్భుతాశ్చర్యావహంబై యమరియున్నది రామనామము
సద్భజనయోగ్యమయి సకలముఁజరుపు నీనామం శ్రీరామనామం॥ ౧౦౦
నిష్కళంకము నిర్వికారము నిర్మలంబగు రామనామము
శుష్క వేదాంతుల కగమ్యతఁజూపు నీనామం శ్రీరామనామం॥ ౧౦౧
సోహభావంబునను నిఖిలముఁ జూరగొన్నది రామనామము
పాహియనిప్రార్థించు జనములభాగ్యమీనామం శ్రీరామనామం॥ ౧౦౨
ప్రకృతిమయమై ప్రకృతికవ్వలఁ బ్రవిమలంబగు రామనామము
సుకృతపరులకు నిత్యసౌఖ్యముఁజూపు నీనామం శ్రీరామనామం॥ ౧౦౩
ఆగమాదులకందరాని విరాగరూపము రామనామము
భాగవతజన పావన పరబ్రహ్మమీనామం శ్రీరామనామం॥ ౧౦౪

ద్వయవిరహితంబగుచుఁ దుదకద్వైతమైనది రామనామము
భయవినాశకరంబయిన సౌభాగ్య మీనామం శ్రీరామనామం॥ ౧౦౫
గేయమై సదుపాయమై యనపాయమైనది రామనామము
శ్రేయతరమగు సర్వమంగళదాయమీనామం శ్రీరామనామం॥ ౧౦౬
స్తవమువిన్ననుఁ బలికించిన నీప్సితములిడు రామనామము
వ్యస్తమని నిందింప నిచుములఁబరచు నీనామం శ్రీరామనామం॥ ౧౦౭
ధరను తమ్మెరపురిస స్థిరమై వరలుచున్నది రామనామము
కరుణఁ గేశవదాసు ననిశముఁగాచు నీనామం శ్రీరామనామం॥ ౧౦౮

మంగళహారతి - ఆనందభైరవి - మిశ్రగతి

మంగళము శ్రీరామచంద్రా దేవ మానీవినుతగుణసాంద్రా॥
సంగీతాలోలా సీ - తాంగనా హృత్కమలా
భృంగా నీరజనేత్ర - సంగాతార పవిత్ర ॥మంగళము॥

వేదాంత వేద్య ప్రకాశా భక్తా - మోదప్రసాదా పరేశా
యాదిత్యకులదీప - యమరరక్ష కలాప .
భేద రహిత వినోద - ఛేదితాఘశ్రీద ॥మంగళము॥
ఆనందాకారా గంభీరా - శ్రితజనావనా వీరాధివీరా
నానాస్త్రజితరూప - సురవైరి జనతాప
శ్రీనిత్య కల్యాణాం - చిత కరుణాపారీణ ॥మంగళము॥
వారిదశ్యామాల దేహా దురిత - దూరాంతరాత్మ నిర్మోహా
సారాచారవిచారా - సన్మౌని సంచారా
ధీరకోదండాంక - తేజా నిష్కళంక ॥మంగళము॥

తమ్మెరపుర వరవాసా భక్తా - దరణా కేశవదాసోల్లాసా
సమ్మోహనాకార - సహజనిర్వికార
మమ్మింకదయఁజూడ - మనవన్యాయమ రేడ ।మంగళము

ఏ త త్స ర్వం బు ను

శ్రీ సీ తా రా మా ర్ప ణ మ స్తు

---

